# కాశీవిశ్వనాథ శతకము.



(విగత పాపయూధ! విశ్వనాథ!)

శ్రీశుఁ గొలచి కావ్యసిద్ధికై పలుకుల
వెలది దలచి పొగడి విఘ్నరాజు
సమాచరిత శతక మారంభ మొనరింతు
విగత పాపయూధ విశ్వనాథ॥

తనివి లేక, జీవితము పెక్కు కాలము
బుచ్చ మేలె? యలత పోక డలను
శునక ముండదె? తినుచుఁ, మనుచుఁ, భువి ॥వి॥

3 బానిసమై, ప్రాపుబడసి, తోఁచునుడు బల
వంతుల సభముల పైకినురుకు
వారిలో దన యధికారము నెలకొల్పు ॥వి॥

4 పనులు నిగ్గు దనను బట్టుకొనిన నధి
కారులు దనపట్టు గలరనుకొన
వారిజుట్టి కుక్కఁబలె దిరిగెడు గూళ ॥వి॥

5 లోని సరకుఁజూడ లొట్టయే యైనను
బ్రతుక దలచు జెనటి బలయుతులగు
వారి బొగడి పాట్లబడి కడు నుబ్బించి ॥వి॥

# శ్రీ కాశీ విశ్వనాథ శతకము.

6 పరువుపోక్కన యని పాటింప డధముడు
బలిత కరుణ బడసి బ్రతుక దలచి
హాస్య పాత్రధారుడై వారి నలరించు ॥వి॥

7 కూర్చు విత్తము శతకోటి లేమి కనంత
కోటి యొక్కి నక్షై కోలుపోవు
పాపకునకు గోచిపాతయె, గతి కదా ॥వి॥

8 అదగు పెదగు లేక బదుగురులో బ్రగల్భ
ముల స్వాతిశయము బలికి బ్రతుకు
మతుల జేయు మివశులగుదు రె పామరుల్ ॥వి॥

9 పండితుడ పై యైన బాటింప రడుగరు
దంభ మెరుగకున్న దాంభికునకు
వశులు బిన్న పెద్ద వారువీరని లేక ॥వి॥

10 మానుట సున్న దంభమంత్రి గహాస్వార్థ
మెరిగియుండ బ్రయోగ పరుపకున్న
జీవనమున కది విశిష్టతారక మెన్న ॥వి॥

11 కలుగువారిది బ్రతుకా స్వయం వ్యక్తిత్వ
మున్న పెద్ద నొకరన్న తెలుగు సడచు
కొందరు తొత్తుకొముకులై వారికి ॥వి॥

12 తెనను బొగడ లేని ధన్యుడు స్వకుచమ
ర్ధను డధముడు వాని దంభములకు
భ్రమసి నిజము గానను వారథమాధముల్ ॥వి॥

13 గొప్పవారి చేతి గుద్దుల పాద
తాడనల నంది కూళ కనుల నీర
మద్దికొనుచు వచ్చి యందర శాసించు ॥వి॥

14 కోర్కె నొండు కొట్టుకొని యత్న మొనరింప
పాపకర్మ దొండు ఫలిత ముండు
మంచి చెడ్డలన్ని మాచేతి మహిమలా ॥వి॥

15 పాట నవసరంబవశ్యముగా గూరు
వలదు వలదన విడువదు లభించు
గలిమి వచ్చుటే ప్రకార మో తెలియదు ॥వి॥

16 కన్ను బడిన వాని గారవించెడు విట
కర్త! యట్టి విధమె విత్త యువతి
దెవడు నచ్చు వానికే దక్కు నొరుబోదు ॥వి॥

17 నమ్మకుంట నాత్రి నారాయణుండు
వక్షమున నునిచికొనిన చంచలంబు
మానద య్యె యిక మానవుల నెంత ॥వి॥

18 ఒకరి నడుగగ ముఖముండదు కార్యసాధ
నకు బొమ్మటన్న దనకు నెదురు
జెప్ప నట్టిదేబె చెరచు బంచిన పని ॥వి॥

19 జన వశీకరణ పొసంగ మ త్రౌషధు
లేవటన్న దంభ మే మొ మంత్ర
మౌషధంబా విత్త మవిగాక లేవొండు ॥వి॥

27 తనది తనకు గాదు తన కొకరి ధనంబు
నబ్బునట్టిలోన ననుకొనునొకొ
యర్థము దర్థవంతులగుపడ బూజించు ॥వి॥

28 అప్రయోజకుడగు నతని సరకుగొన
రఖిల శాస్త్రవేత్తయైనగాని
యొకరి కొకరి జుట్టు నొగి ముడినిడకున్న ॥వి॥

29 పూటకూటి వృత్తి బూనికి భాషా
ప్రవీణు లొకరు సాకు పీలు లేమి
పండితులను గనునె రండ ప్రపంచము ॥వి॥

30 ముదలు బ్రాణి కన్నముఖ సృజియించెనో
లేదొ కాని తా ననాదికాగ
దంభమే సృజించె నంభోజగర్భుండు ॥వి॥

31 దృష్ట కెట్టి మార్పుదల లేదు నాటక
రంగమున దెరల తెరంగు ప్రకృతి
యగుపడియెడు మృత్యురాద్యవస్థల మారి ॥వి॥

32 మిన్ను విరిగి నెత్తిమీద గూలిన భూమి
పగుల నీర మొండవాయువు వడగ
నేది నాకు దిక్కు నీదయయే తక్క ॥వి॥

33 యత్నముల బొసంగ దంతగనే యుండు
గడక లేమి దరుగుగాదు కోరి
తెచ్చికొనిన పరువు వచ్చినట్టులె పోవు ॥వి॥

34 కాలవశముచేత ఘను డవమానింప
బడిన జూచినగుట పాడిగాదు
శౌరిదస్నగ మునిసత్తముడానాడు ||వి||

35 మాన వీశ్వరేచ్ఛ మానావమానము
లెల్లరకు స్వకీయ మెరుగ కొరుల
కగు పరాభవమున కలరు మూఢుండెద ||వి||

36 ఇచ్చువాడవ్వండ నిహపరంబుల రెంటి
గోర కొక్క- పరమె కోరుచుండ్రు
కోరఁగూడదను నొకో నోటిశనివారి ||వి||

37 మాటమాత్ర నొకరి మర్మ మెరుంగ
శక్యంబుగాదు నరులు గపటులుండ్రు
వినయసూక్తి నంతె విషపాత్రకుడెవాడు ||వి||

38 పెట్టెరీతినే గడించుటే పురుషార్థ
మనుచు దలతురు జనులటులు గాదు
హీనవృత్తి ననక నిల్గుటే మేలగు ||వి||

39 పాపి సొమ్ము శ్వపచుపాలు రాజుల సొమ్ము
రాళ్లపాలు పీచు రండకొడుకు
కలిమ దేమొ దంపుగల దొపిడులపాలు ||వి|

40 ఒకని కిడుటు నొల్లడొంటరి దినగోరు
దాచుకొనదలంచు నీచుడశన
మెముఁగ నెత్తుక బరుగెత్తును శునిబోలి ||వి||

41 బ్రతుకు నన్నినాళ్లు బరచింతనయె లేక
మనెడు నరుడు జచ్చు మరలబుట్టు
మలిన యోనికూపముల మునింగెడు దేలు ॥వి॥

42 తాను గుడిచి కొంత దారాసుతాలకుంచి
దాన ధర్మమను మది దలపడేని
విత్తమున్న సరియా? యెత్తుక దినుటకా? ॥వి॥

43 నగవుజూపి లాలనముజూపి భోగము
నాని విధము నటనసలిపి గొప్ప
వారి ప్రాపుబడసి బ్రతుకు తుచ్ఛుడు సదా ॥వి॥

44 చేతనైన కొలది చేయుడు చేయకె
బోన జేయువారి బూడజేయ
డలతివాడు భక్తి నతి నీచమని యెంచి ॥వి॥

45 బానిసయ్యె తాను బ్రతుకుచు తుచ్ఛుడు
తన వినయ విధేయతలను గరపు
గొప్పవారి చెంతకుక్కబోవు నొరులకు ॥వి॥

46 అక్కట హరిదాసు డపరియోజకుడు
భిక్షాటకుడని మది ననికొనియెడు
వీత భక్తి గుణుడు విద్యావిహీనుడు ॥వి॥

47 స్వగుణమిసుము బయలుపడకుండ బెట్టుగా
సంచరించు లంజ లంచగాడు
న్యాయశీలుకడ ఘనంబుగా మరికొంత ॥వి॥

48 ఇల నరునకు దోచబలె నన్నతోపమి
విసగవలయు జెప్ప విహితమన్న
విననివాని దన్ని విడచుటే మేలన్న ॥వి॥

49 న్యాయమార్గ గామి కన్నము బుట్టదు
దుష్పథ చరుడేమొ దోసగునబడు
బ్రతుక దలచువాని బాట యేద్రైయుండు ॥వి॥

50 ముస్తికొనన? నీకు ముజ్జగంబుల శాస
నాధికార ముండి యడుగుక తిని
గంపు భక్తజనుల గతి గనుగొనకున్న ॥వి॥

51 శౌరి కఠినుడని భుజంగభూషణ తవ
శరణుగొంటి నీదు సరసమంత
కంటిమించె తెలిసికొంటి మేల్సరిసరి ॥వి॥

52 హరి హరులకు భేద మనరాదటందురి
నిక్కము నిదర్శనముగ గంటి శౌరి
కఠినుడైన నీకు గనికర మెటులుండు ॥వి॥

53 గట్టు నెత్తితిమని మిట్టిపడకుము చాప
మున కీవు వల్లవతతికి హరి
అబలయెద దరింప దా కుచాద్రుల రెంటి ॥వి॥

54 పలుకకుండుట మెడబసుదు నేననిపోలు
కుటిలుడనక మేదకుడన నీకు
నొప్పు నట్టులు విషముండ గుత్తుకనిండ ॥వి॥

55 కడకనుండి కొంతకాల మలంకార
విద్య గరువరాదె విష్ణునికడ
బూది బూసుకొనుట పోలునే సవ్వారే ॥వి॥

56 ఉనికి వల్లకాదు యురగము మొలత్రాడు
కనలు మూడు యడుగుకొ నదు కూడు
తప్పకుండె యొక్క దాని కొక్కటి తోడు ॥వి॥

57 చావుపుట్టుక లేని చండకరుం డస్త
మించి తోచుబలె జనించు జచ్చు
జీవు డతని కెన్న జావు బుట్టుకలున్నె ॥వి॥

58 సాదృశములుగాగ జాగ్రచ్చుషుప్తులు
జననమరణ మెరుగ జాలరొక్క-
జీవునకు స్వభావసిద్ధ ధర్మ్మలెయని ॥వి॥

59 అర్కుబోలి యాత్మ యాద్యమాక
ల్పాంత్య మొక్కటంత నిండుయుండునదియె
పుట్టు దేహములకు బుట్ట దనేకమై ॥వి॥

60 క్రొత్తగాను వెలుగుకొరకు పిమ్మత్తు
పూర్వముదిగాక వేరువచ్చియున్నె
పూర్వజీవు వెలుగుబుట్టు శరీరముల్ ॥వి॥

61 తినుటకై యనుకొన మిగులగ గను
పంచిపెట్టడిసుము గొంచుబోడు
గూర్చుచుండు నేలొకో లుబ్ధు డర్థము ॥వి॥

62 పంచభూతములు ప్రభాకర చంద్రులు
జీవుడట్టులె యివి సృష్టికొకటి
కొకటిగాని యుండియును సర్వమయములో ||వి||

63 అలరునన్నదాన యాచిత శ్రీనొల్ల
డీవుగన గుబేర హితుడవయ్యు
గాగి నగల పలరులాగున విబుధుండు ||వి||

64 గవ్వనైన ముట్టకక బ్రాణ సమముగా
గూర్చ దానివానికొరకు లుబ్ధు
డనుగ జెప్పవలెకదా లెక్క క్రమముగా ||వి||

65 తెనస బోలి యున్నతస్థితి కొకముగా
సైచమాత నిడడు నీచు డడగ
ద్రొక్క యత్నములకు దొగకొనుచుండెడు ||వి||

66 గూని మొడల బెట్టికొని నడచు నొకడు
గాళ్ల నేలగొట్టి గాడిదబలె
నడచు నొక్కడు నవనాగరికుడనని ||వి||

67 బీదల నొకనికి లభించిన సిరివాని
తీరుమారు వాడతిశయముబడు
మరియు నితరు హీనపుల్ దృక్కులల్ గను ||వి||

68 స్వయముగాని పిలిచి వచ్చు పండుగులకు
గుడిచిపోవు బందుగులను జూరు
కూళవాని విందు గుడుచువారజ్ఞులు ||వి||

69 అతిధి కొక్కపూటకైన సోలెడు పెచ్చు
మించి జనెడుపట్ల గొంచబోడు
వాని బంతిగుడుప నగచెదరేలొకొ ||వి||

70 పాపపుణ్యములను బాటింప పధముడు
వీలుజిక్కిన పదివేలుకొట్టు
కొని భుజించెడు బురుగులను సాలీడట్లు ||వి||

71 సరకుగొనడు కూళ స్వపరమానావమా
నముల రొక్కమబ్బిన బదివేలు
యెంత ఘోరకర్మకే సాహసముజేయు ||వి||

72 కూరుచుండబెట్ట గోయును సొరకోత
లెన్ని డబ్బుపట్ల నన్ని పోవు
వీలు దప్పకొనగ వెదకు సల్పుడు సదా ||వి||

73 చేయజాల కెటులో జేయు లుబ్బుడు ధర్మ
కార్యము దన బొగడగా దలచియొ
కాక ద్రోయజాలకనో మొగమాటము. ||వి||

74 పట్టుకొని తెచ్చి బలవంతముగ విను
పింప విరసుడుగ్రహింపగలడె
ఊరకుండ నోడి యూకొట్టుడుగాక ||వి||

75 నూనెలేమి నీరమైన రుద్రుకతల
దుష్ప్రవ్వ ముఖమునకు మెరుంగుబెట్టు
గూళివాడునైన గోరు స్వాలంకృతి ||వి||

76 కలసునైన దలపకయె పర పురుషేచ్ఛ
మానుయువతి సాధ్వికాని కాల
మునకు గట్టుబడిన వనితలు పుణ్యలా ||వి||

77 ఘాంత దృష్టిగోరి దాతయొక్కండు
సమృద్ధి ఖర్చు జేయ సిద్ధపడిన
పెట్టనేర్తు గేల పెత్తనదారులు ||వి||

78 భక్తిగల్గుండిన యుండవచ్చును లేకపో
లేకపోయియుండుగాక సరులు
గాసింపు ముందుమాల గోవిందల గొట్ట ||వి||

79 పిలుచుచుండుపాట శ్రుతి పేరటిజోరీగ
జేరుచు శ్రుతి వేరు జోరుటీగ
లట్లుకాని హరికథాసక్తి నొకొ సరుల్ ||వి||

80 ప్రొద్దుబుచ్చుకొనగ బోవగుదురు హరి
కథను వినట గోరికాదు జనులు
జారుదురు విచిత్ర సంగతులుండమి ||వి||

81 తిట్టదిట్టనిమ్ము దీవింప దీవింప
నిమ్ము నెట్టులైననేమి పొట్ట
కూటి కొఱకు నిజేరి కొలుచు నీచుడు సదా ||వి||

82 భక్తులైన వారిపట్ల నసూయ ని
ష్ఠురములాడు నొకరు జూచుకొరకు
వారి పట్లను వెరువకె బుద్ధిహీనుడు ||వి||

83 ఎవనికైన వంక యేరు దత్ప్రాప్తి పరి
దర్శనం బొసర్చు దైవిక యను
గాక నొండు పరిజ్ఞ గలదె యల్పునకిల ||వి||

84 కాలమహిమచేత గానివాడయ్యు దుర్జ
నుండు పరులు తెలియకుండ నుండ
గంబడిన తన పనికాదని సరిజెప్ప ||వి||

85 స్వల్పుడైన వాని సనను సన్మానింప
గొప్ప జేతు మేని యప్పుడే తన
గుణము జూపుగొట్టకొనకొమ్మ గూర్చొను ||వి||

86 తప్పుజేయు బాదతాడనమందు న
దంత నీశ్వరేచ్ఛ యను నిజంబు
వశమె తప్పుకొనగ బ్రాజ్ఞునకే విధి ||వి||

87 తన యకృత్యమునకు దైవేచ్ఛ యని యొక
టడ్డమిడక నొరుల కటులనేల
దలపడొక్కొ వారి దర్జించు మర్త్యుడు ||వి||

88 ఎదుటవానిపైకి నెగసినట్టులనె దం
డించునట్టులనె నటింపరాదె
తనను గూర్చి నరుడు దన తప్పిదమునకై ||వి||

89 తామనేకులయ్యు దైవమనేక మ
నియెడు వారిదేమి నేరమట్లు
వారలన్ సృజించువానిది నీతప్పు ||వి||

90 లచ్చి లుబ్ధగృహములఁబడి సద్విని
యోగపడక మురుగుచుంట యదియు
నాపి పూర్వజన్మ పాపఫలితమె సుమా ||వి||

91 నూటి కొకనివంతు నేటికి సజ్జను
లవని నుండకుందురా మరేమి
భయము లేదు మంచిపని నెరవేరగా ||వి||

92 కష్టసుఖము లెరుగకయె హాయిగా దిని
పెరుగునాతడగు న పెద్దమనిషి
వ్యావహారకు డనుభవశాలి యగుగాక ||వి||

93 మత మనంగనేమి మతమేడిగా నేమి
మతపు మంచిచెడ్డ మాటయేమి
బాట వేరగుగదా పరమాత్మ వేదికి ||వి||

94 కూడనిదని తెలిసికూడ యన్యాలు వల
దనిన సరకుగొనక ననుభవించు
వక్రగతిని నడచువాడు తత్ప్రాప్తము ||వి||

95 రక్తిజూపడగ శిరమునూచు నౌనను
నేమెరింగితివన నేగి మరల
చెప్పుమను నిదేమి చిత్రమో విరసుడు ||వి||

96 క్రమ మెరుగను చెప్పగాదు విద్యార్థుల
కడలు బోడమురీతి వ్యాసమిచ్చు
నాశ్రయింప జనదు స్వల్పవిద్యావంతు ||వి||

97 పదుగురు జనుచుఁడు పథమున గూర్చుండి
వచ్చి పోవువారి వంక లేరి
యెదియొ చెప్పుకొనుచు నిగిలింతు్రి తుంటరుల్ ||వి||

98 వ్యావహారికుల సహవాసమైన భా
గవత సఖ్యమైనగలుగ కునికి
పిదప లాటకముల వేసుకు తుచ్ఛుడు సదా ||వి||

99 కష్టసౌఖ్యములకు గాలమింతన లేము
కానిమార్పు తప్పకనె ఘటించు
నిండునెలయె శూన్యముండు నమావాస్య ||వి||

100 ప్రాణుల కని యుపకరణముల సృష్టించి
నపుడు పక్షపాత మర్హమగునె
విత్తపరులకొసగి బీదల నేడ్పింప ||వి||

101 సామ్య దు్రక్కులకా పరిసారించు నీవుండ
కలిమి లేమి చేయగలుగునేమి
ధనపరుండె ధాత్రిమను బీదమనడకో ||వి||

102 ఎంచ లింగమొండు బాంచభౌతిక కళే
బరమునందు దాల్ప స్థిరమగునొకో
లింగ తనువె ముక్తి సంగతి నశియింప ||వి||

103 మూర్ఖులలరు కోరకు ముక్తికి కాదు జ
పాను లటుల గొందరవని మనెద
రట్టివారె కోతురరువగ గుత్తుకల్ ||వి||

